Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం II.] మద్రాసు : 1942 వ సం॥ మార్చి నెల 20 వ తేది శుక్రవారం [నెం 11 రు.

## హాంకాంగులో జపానువారి రాక్షస కృత్యాలు.

### యుద్ధ ఖైదీలగు బ్రిటిషు సైనికులను కాళ్లుచేతులు బంధించి తుపాకీసన్నీలతో పొడిచి చంపిరి.

హాంకాంగులో జపాను వారికి వశమైన బ్రిటిషు సైనికులు జపానువారి యుద్ధ ఖైదీలుగా వున్నారు. వారి గతి ఏమైనదనే విషయమును బ్రిటిషు గవర్నమెంటువారు రూఢిగా తెలిసికొన్నారు. ఆ వివరములన్నియు వాస్తవముగా తెలిసిననే తప్ప ప్రకటించకూడదని ఇంతవరకూ బ్రిటిషు అధికార్లు కాలహరణము చేసిరి. కాని అవి నిజమని రూఢిగా తెలిసినది. అంతేగాక హాంకాంగులోని బ్రిటిషు పౌరులును బ్రిటిషు సైనికులును అగు యుద్ధ ఖైదీలకు జరిగిన ఘోర కార్యములను వెల్లడించినందువల్ల వారి బంధువులకు చాలా విషాదము కలుగుననే భయముచేతకూడా వెంటనే వెల్లడించకుండా నిల్పియుంచడమైనది. హాంకాంగులో జపానువారు చేసిన యీ ఘోరపాతక రాక్షసకృత్యములను బ్రిటిషు విదేశాంగ మంత్రియగు యీడెనుగారు పార్లమెంటు సభలో వివరించి చెప్పిరి. హాంకాంగునుండి తప్పించుకొని వచ్చినవారు కొందరు తాము ప్రత్యక్షంగా చూచితిమని ఆ రాక్షసకృత్యములను వర్ణించి చెప్పినందువల్ల వార్తలు రూఢియైనవి.

హాంకాంగులోవున్న బ్రిటిషు పౌరులను, సైనికులను కూడా ఒక్కటే విధంగా క్రూరంగా హింసించారు. తెల్లవారినిగాని, నల్లవారినిగాని జాతిభేదం పాటించకుండా హింసించారు.

50 మంది బ్రిటిషు సైనికోద్యోగులను కాళ్లుచేతులుకట్టి జపాను సోల్జర్లు తమ తుపాకీల చివరవుండే సన్నీలతో (బాకులతో) పొడిచి చంపివేసినారు.

హాంకాంగులో యుద్ధం జరిగి బ్రిటిషు సేనలు శత్రువుకు లొంగిపోయిన 10 రోజులకు పిమ్మట, యుద్ధంలో గాయపడినవాళ్లను, అక్కడక్కడ కొండ ప్రాంతాలలో వుంటే, తీసికొనివచ్చి భూశయనం చేయవలెనని కొందరు ప్రయత్నిస్తే జపాను సైనికులు అందుకు అనుమతి యివ్వలేదు.

ఆసియాఖండవాసులగు స్త్రీలైనాసరే, యూరోపియను స్త్రీలైనా సరే, వాళ్లను యథేచ్ఛగా జపాను సోల్జర్లు మానభంగంచేసి చెఱచి హత్యలు చేసారు. చైనావాళ్లు నివసించివుండే ఒకభాగం యావత్తూ, బోగం వీధిగా సైనికాధికారులు నిర్ణయించారు. ఆ ప్రదేశంలో నివసించేవాళ్లు ఎటువంటి హోదాలోని వాళ్లయినాసరే, లక్ష్యం చెయ్యకుండా వాళ్ల స్త్రీలను బలాత్కారంగా జపాను సైనికులు చెఱచినారు.

అక్కడ హాంకాంగులో యుద్ధం ముగిసిన తర్వాత చనిపోగా మిగిలిన చైనా సైనికులు, భారతీయ సైనికులు, పోర్చుగీసువారు, వీరందరూ కొన్ని గుడిసెలలో యుద్ధ ఖైదీలుగా బంధింపబడినారు. ఆ గుడిసెలకు ద్వారబంధాలు లేవు. కిటికీలు లేవు-జనవరి మాసాంత్యమునకు వారిలో 150 మంది గ్రహణి వ్యాధిమూలంగా చనిపోయినారు. వారికి మందులు ఇచ్చినవారెవరూ లేరు. చనిపోయిన వాళ్లను ఆ గుడిసెల వద్దనే ఒకమూలగా పాతిపెట్టినారు.

జపాను సేనాధిపతితో మాట్లాడుటకు అనుమతి యిప్పించవలసినదిగా అక్కడ ఆ నిర్బంధ ప్రవాసమునకు కాపలాయున్న జపాను పహరా సోల్జరును జనరలు మాల్టుబీగారు అడిగారు. కాని, అనుమతి యివ్వడానికి వీలులేదన్నారు. కాబట్టి జపాను సైనిక శాఖాధికారులుకూడా యీ ఘోర రాక్షసకృత్యములను హర్షించుచున్నారనియే విదితమగుచున్నది.

ఫిబ్రవరి మాసాంత్యమునకు హాంకాంగులోవున్న యుద్ధ ఖైదీల సంఖ్యను జపానువారు యీ క్రింది రీతిగా ప్రకటించారు:—ఆంగ్లేయులు—5,072; కెనడా దేశీయులు—1,689; భారతీయులు 3,829 మంది; ఇతరులు 357—మొత్తం 10,947 మంది.

హాంకాంగులో నివాసంగా వున్నటువంటి యూరోపియనులు కొందరు నిర్బంధప్రవాసంలో వుంచబడి యున్నారు. వీరిలో కొందరు వ్యాధిగ్రస్తులై ప్రమాదావస్థలోకూడా వున్నారు, యుద్ధ ఖైదీలగు సైనికులకు యివ్వబడినట్లుగానే ఈ నిర్బంధిత పౌరులకుకూడా కొద్దిగా బియ్యపు అన్నమున్నూ నీళ్లు మాత్రమే ఆహారంగా యిస్తున్నారు.

ఇటీవల అచటి యుద్ధఖైదీల దుర్భరస్థితి కొంచెం బాగుపడినదని తెలుస్తోంది. హాంకాంగులోవున్న యీ యుద్ధ ఖైదీలను ఒకసారి సందర్శించుటకు అనుమతి యివ్వవలసిందని పరిరక్షణ రాజ్యప్రతినిధి యొకడు అడుగగా, అట్టి పర్మిషను యివ్వబడలేదు. అంతర్జాతీయ రెడ్‌క్రాస్ కమిటీవారు యుద్ధకాలంలో ఎక్కడ ఏ యుద్ధరంగంలోనైనా బాధితులకు గాయపడిన వారికి సహాయం చేసేటటువంటి కేవల పరోపకార సంఘంవారు. అటువంటి రెడ్‌క్రాస్ సంఘము యొక్క ప్రతినిధికి ఏ రాజ్యమువారైనా అడ్డు చెప్పకుండా అటువంటి అనుమతి యివ్వవలెను. ఇది అంతర్జాతీయ యుద్ధనీతి, కాని, అట్టి రెడ్‌క్రాస్ సంఘపు ప్రతినిధికికూడా ఆ యుద్ధ ఖైదీల మకాములోనికివెళ్లి వాళ్లను చూచుటకు అనుమతి యివ్వబడలేదు.

# చైనాలోని జపాను యుద్ధ ఖైదీల సౌకర్య సదుపాయములు

చైనాలో ప్రస్తుతం ప్రభుత్వ పీఠంగా ఉంటున్న చుంకింగు నగర సమీపంలో ఒక చోట యుద్ధ ఖైదీల మకాము ఉన్నది. యుద్ధ ఖైదీలుగా పట్టుకోబడిన జపానువారు కొందరు ఆ మకాములో వున్నారు. వీరిలో స్త్రీలు, పురుషులు వున్నారు. మూడు జాతుల వారున్నారు. వీరందరూకూడా పరరాజ్యాలనూ ఆక్రమించవలెననే శత్రువ్యూహానికి సాధనభూతులై పనిచేసినవారే. అటువంటి వాళ్లు నేడు చైనా ప్రభుత్వము వారేర్పాటుచేసిన యీయుద్ధ ఖైదీల మకాములో చక్కని సౌకర్యాలు కలిగి చైనావారి దయాదాక్షిణ్యములకు పాత్రులై క్రొత్త జీవితానుభవం రుచి చూస్తూన్నారు.

వీరిలో చాలామంది యుద్ధ భూమిలో దెబ్బలు తగిలి గాయపడినవారైయున్నారు. కొలది దినాలక్రిందట ఘోర నరసంహారం జరుగుచుండిన యుద్ధరంగంలో తాముకూడా అందుకు సాధనభూతులై పనిచేసియున్నవారు, నేడు యీ మహామారణ హోమంతో ప్రసక్తిలేకుండా భద్రంగా యీ మకాములో వుండగల్గినందుకు సంతోషిస్తున్నారు.

వీరిలో చాలామంది జపానువారే 30 మంది మాత్రము కొరియావారున్నారు. రష్యాలోని యూక్రేను పరగణా నివాసి ఒకడున్నాడు. ఇతడు చైనా సేనల సంచలనమంతా కనిపెట్టి చూచి జపానువాళ్లకు చెప్పుతూ వుండేవాడు. ఈ యుద్ధ ఖైదీల మకాములో ఆరుగురు కొరియా దేశ స్త్రీలున్నారు. వీళ్లు, జపాను సేనల వెంటవచ్చిన పరిచారిక జనంలోని వాళ్లు. జపాను సోల్జరుల విలాస కాలక్షేపానికి వినోదార్థంగా వచ్చినటువంటివాళ్లు ఆస్త్రీలు.

ఈఖైదీల మకాములో అందరికన్నా పెద్ద సైనిక హోదాకల కర్నలు ఒకడున్నాడు. అంతకంటె పెద్ద హోదా వాడు లేడు. అతడు జపాను అశ్వికదళంలోనివాడు. మిగిలిన యుద్ధ ఖైదీలందరూ, మేజర్లు సిపాయిలు, సార్జంట్లు, భటులు వగైరా రకంవాళ్లు. ఆ యుద్ధ ఖైదీలందరిలోను బాగా చదువుకొన్నవాడు ఒక కాలేజి ప్రొఫెసరున్నాడు. అచటనున్న మిగిలిన జపాను యుద్ధ ఖైదీలందరూ వ్రాయడం, చదవడం మాత్రమే నేర్చినవాళ్లు. కొరియనులకు అదికూడా తెలియదు. కొరియా దేశం జపానువారిచే ఇదివరకే జయింపబడిన రాజ్యం. అందువల్ల వారికి విద్యాభివృద్ధికి కావలసిన అవకాశాలు లేకుండా జపానువాళ్లు చేశారు.

ఈ యుద్ధ ఖైదీల మకాములో వీరికి ప్రతి ఏర్పాటూ టైము లెక్క ప్రకారం చేయబడుతూ వుంటుంది. ఉదయం 5 గంటలకు నిద్రలేస్తారు. హాజరు పట్టీ పేర్లు పిలువగానే, వారి ప్రాతఃకాల శరీర వ్యాయామం చేస్తారు. ఉదయం 7 గంటలకు ప్రాతఃకాల భోజనం. వారి విద్యావ్యాసంగ కాలక్షేపానికి ఉదయం 9 గంటలు మొదలు 11 గంటల వరకు వినియోగిస్తారు.

మధ్యాహ్నం 2 గంటలకు భోజనం. 12 గంటల నుంచి 4 గంటల వరకు విశ్రాంతి. అటు పిమ్మట వారు చదువుకొనే గదులకు వెడ్తారు చదువుకొనేవారు చదువుకొంటారు. వ్రాసుకొనేవారు వ్రాసుకొంటారు. ఆ విషయంలో నిర్బంధమేమీ లేదు. సాయంకాలం 4 గంటలకు స్నానం. సాయంకాలం $5\frac{1}{2}$ గంటలకు రాత్రి భోజనం. 6 గంటలయిన తర్వాత ఆటలాడుకుంటూ వుంటారు. గదులలోనే కూర్చుండి చదరంగంగాని, పింగుపాంగు అనబడే మేజాబల్ల టెన్నిసు ఆటగాని, ఇతర ఆటలుగాని ఆడుకొంటారు. రాత్రి 9 గంటలకు తిరిగి ఖైదీల హాజరుపట్టీ పిలుస్తారు. అటుతర్వాత నిద్రపోతారు.

ఇక్కడ వున్న జపానువాళ్లన్నూ కొరియా వాళ్లన్నూ ఈ ఖైదీల మకామువద్ద పహరావున్న చైనా భటులకు తమ భాష నేర్పి, చైనా భటులవద్దనుంచి చైనా భాష నేర్చుకొనుచున్నారు. ఒకరి అభిప్రాయాలు ఇంకొకరు అర్థం చేసికొని గ్రహించడానికి వీలుగా భాషలు నేర్చుకొనుచున్నారు. ఒకరి భాష ఇంకొకరికి తెలియకపోవుటవల్ల చాలా దురభిప్రాయాలు కలిగినాయి.

కాని యిప్పుడు అంతా సక్రమంగానేవుంది. అంతా సమాన సోదరభావంతో సంచరిస్తున్నారు. ఇక్కడి ఖైదీలలో కొందరు మాత్రం మొండిపట్టుదలతో ప్రవర్తిస్తున్నారు. సౌమ్యంగా చెప్పిన విషయాలు వారి చెవికెక్కడం లేదు. ఈ మకామునకంతకూ పైఅధికారం వహించిన కర్నలు సూగారు మాత్రం అన్ని వెంకితనాలూ క్రమేణా చక్కబడి దారిలోనికి రాగలవనే ధైర్యంతోనే వున్నారు.

ఈ ఖైదీలు తమ వంటలు, తమ శాకపాకములు తామే చేసుకొనడానికి అవకాశమిస్తున్నారు. తమ కిష్టమైన రుచికరమైన పదార్థములను వంట చేసికోవచ్చును. ప్రతి బుధవారం జపానుదేశపు పిండివంటలు చేసుకొంటారు. నెలకొకసారి వారందరూ జపానుదేశ పద్ధతిగా వినోద కాలక్షేపం చేస్తూవుంటారు.

సిగరెట్లు కాల్చేవారికి రోజుకొక సిగరెట్ల పెట్టె సప్లయి చేయబడును. వారానికొకసారి ద్రాక్షసారాయము ఇవ్వబడును. మనిషి 1 కి 4 ఔన్సులు మాత్రమే యిస్తారు. జపానువారికి వారి దేశంలో అలవాటైన మద్య పానీయం (సాకే) మాత్రం సప్లయి చేయబడుట లేదు. జపాను దేశ పానీయం ఎంత ఘాటైన సారాయమో అంతఘాటైన సారాయమే సప్లయి చేయబడుచున్నది.

ఈ యుద్ధఖైదీలు ఉత్తరములు వ్రాసుకొనవచ్చును. కాని వారికివచ్చే వుత్తరాలు, వారికితరులు వ్రాసే వుత్తరాలు అధికారులచే పరిశోధన చేయబడి పంపబడుతూ ఉంటాయి. వారి స్నేహితుల వద్దనుంచిగాని, బంధువుల వద్దనుంచిగాని, పైకంవస్తే యీ యుద్ధఖైదీలు తీసికొనవచ్చును. ఏవైనా బట్టలు పంపిస్తే స్వీకరించవచ్చు. ఇప్పటివరకు యీ యుద్ధ ఖైదీలవద్దకు జపాను ద్రవ్యమానంలోని పైకం చాలా చేరి నిల్వగా ఉంది. వీరికి వచ్చే పైకం మంచూరియా నుంచి ఎక్కువగా వస్తుంది. జపానునుంచి చాలా తక్కువగా వస్తుంది. జపానులో కంట్రోలు ఎక్కువ. అందువల్ల అక్కడనుంచి పైకం వీళ్లకు విశేషముగా రాదు.

యుద్ధంలో గాయపడి క్రమేణా ఆరోగ్యం పొందుచున్న ఖైదీల విషయంలో ఎక్కువ శ్రద్ధ వహించబడుచున్నది. వారికి వైద్యసహాయం మాత్రమేగాక, పాలు, ఎర్రచిక్కుడు, తియ్యని చిలగడదుంపలు మొదలైన పుష్టికరమైన, సులభంగా జీర్ణించే ఆహారపదార్థాలు ఇవ్వబడుచున్నవి.

ఈ యుద్ధఖైదీలలో పురుషులు వేరే ప్రత్యేక గదులలోను, స్త్రీలు ప్రత్యేక గదులలోను రాత్రి వేళలందు నిద్రపోవుచుం

దరు. పగటి వేళలందుమాత్రము వారు గ్రంథ కాలక్షేపాల లోను, ఇతర పనిపాటులలోను కలిసి మెలిసి ఉంటారు.

ఈ యుద్ధఖైదీలచేత లాభకరములైన చేతి పనులను చేయించి వారిద్వారా సబ్బులు, తువ్వాళ్లు, తుండు గుడ్డలు, గడ్డితో తయారు చేయదగిన చెప్పులు, ఇతర నిత్యకృత్యావసరములైన వస్తువులను వారి తీరికవేళలందు తయారు చేయించవలెననియు, తయారైన వస్తువులను అమ్ముటవల్ల వచ్చే ద్రవ్యమును, ఆ యుద్ధఖైదీల పోషణకొరకు అయ్యేటటువంటి ఖర్చుకు సరిపోవునట్లుగా చేయవచ్చుననియు, ఆ ఖైదీల మకాముకు పై అధికారిగానున్న కర్నలు సూగారు ఒక ఏర్పాటుచేసి పరీక్షార్థంగా సాగిస్తున్నారు.

# మక్కా యాత్రికుల నిర్భయ సముద్ర ప్రయాణం.

ఈ యుద్ధ సమయంలో కూడా ఇండియానుంచి మక్కాకు యీ సంవత్సరం మక్కాకు పోయిన యాత్రికుల సంఖ్య చాలా ఎక్కువగా ఉన్నది. 10,400 మంది యాత్రికులు మక్కాకు వెళ్లి కాబా చుట్టూ ఏడు ప్రదక్షిణాలు హాజ్ పర్వదినంనాడు అనగా డిసంబరు 28 తేదిని చేసారు. వీరిలో 5 వేలమంది యాత్రికులు తిరిగి యిండియాకు వచ్చారు. ఇంకా 5,400 మంది తిరిగి వస్తున్నారు. త్రోవలో ఉన్నారు. మహమ్మదీయ మత ధర్మముల ప్రకారంగా మక్కా యాత్రచేసికొని వచ్చుటకు స్వతంత్రాధార సౌకర్యములున్న ప్రతివాడున్నూ తన జీవితంలో ఒక్కసారి అయినా మక్కాయాత్ర చేసిరావాలి. హాజ్ పర్వదినానికి మక్కాకు వెళ్లిరావాలి. తాను వెళ్లిరాలేకపోతే, తన తరఫున ఇంకెవరినైనా తన ఖర్చుమీద, ఆ పర్వదినం నాటికి మక్కాకు పంపించాలి.

హాజ్ పండుగనాడు "భగవదనుగ్రహ పర్వతం" అనే కొండచుట్టూ యాత్రికులు సమావేశం అవుతారు. ఈ ప్రదేశం మక్కాకు కొంచెం దూరంగా ఉంటుంది. మీనా వద్ద రాళ్లు రువ్వడం అనేదికూడా అక్కడి యాత్రికుల కర్మకాండలో ఒక భాగం. అక్కడ ఒక బలియిచ్చి భగవంతునకు నివేదించిన పిమ్మట దానిని ఆరగించాలి. యాత్రికులు అక్కడ తలలు క్షౌరం చేయించుకోవాలి. కాబా చుట్టూ ప్రదక్షిణం చెయ్యాలి. అక్కడ ఒక నల్లని రాతి బండను అందరూ ముద్దుపెట్టుకోవాలి ఆరాయి చాలా పవిత్రమైనది.

మక్కాకు వెళ్లి తిరిగి బొంబాయికి, కరాచీకి ఇటీవల తిరిగి వచ్చిన వారిలో స్త్రీలు, పురుషులు, పిల్లలు చాలామంది ఉన్నారు. ఇండియాలోని అనేక రాష్ట్రములనుంచి వచ్చినవారున్నారు. చైనాలోని మహమ్మదీయులు కూడా చాలామంది టిబెట్టు మీదుగా ఇండియాకు వచ్చి ఇక్కడనుంచి మక్కాకు వెళ్లి యాత్ర చేసికొని వచ్చారు. ఈ చైనా వారిలో ఎవరికిన్నీ, ఇండియాలోని భాషఏదిన్నీ రాదు.

ఇటువంటి యుద్ధ సమయంలో వీరి కందరికీ సుఖంగా మక్కాయాత్ర చేసికొని వచ్చుటకు సౌకర్యం కలుగజేసినందుకు ఇండియా ప్రభుత్వాధికారులకు వారు తమ కృతజ్ఞతను తెలియజేసినారు. గత రెండు సంవత్సరాలలో జెడ్డాకు చేర్చబడే యీ యాత్రికుల సంఖ్య ఇంత ఎక్కువగా లేదు. కాని యీ సంవత్సరం యాత్రికుల సంఖ్య చాలా ఎక్కువగా ఉన్నది. ఈ యాత్రికులు ఎంతమంది జనం ప్రయాణం చేస్తారని గవర్నమెంటువారు అంచనా వేసుకున్నారో, అంతకంటె నూటికి 40 వంతు ఎక్కువమంది జనానికి మొగలు స్టీమరు కంపెనీవారి స్టీమర్లలో అవకాశం బాగా లభించింది. గవర్నమెంటువారు చేసిన అంచనా మదింపు లెక్కలే చాలా హెచ్చుగా వేసియుండిరి. కాని యీ యుద్ధ సమయంలో ప్రయాణపు ఖర్చులు మాత్రము కొంచెం హెచ్చుగానే ఉన్నాయి. మామూలుగా అన్ని వస్తువుల వెలలు హెచ్చుటవల్ల యీ ప్రయాణపు ఖర్చులుకూడా హెచ్చినవి.

ఇండియానుంచి జెడ్డాకున్నూ, జెడ్డానుంచి ఇండియాకున్నూ ప్రయాణం చేసి వచ్చినవాళ్లు అనేక విచిత్ర యాత్రానుభవాలు కథలుగా చెప్పారు. మక్కాయాత్రను ఇదే మొదటి సారిగా చేసినవాళ్లకు మాత్రము ఈ యాత్ర చాలా మనోహరంగా ఉల్లాసకరంగా సాగిందని అన్నారు.

గాలివాటం బాగా వుంది. కాలమానమూ ఋతువు కూడా యాత్రకు చాలా అనుకూలంగానే ఉన్నాయి సముద్రం మీద అల్లకల్లోలం ఏమీ లేదు. యాత్రికులకు ఎవరికీ ఆరోగ్యభంగములు కలుగలేదు.

యాత్రికుల ఓడ సముద్రంమీద ప్రయాణము చేసినప్పుడు, రాత్రి వేళలందు ఓడమీద దీపాలన్నీ పూర్తిగా ఆర్పివేయబడెను. అందువల్ల యాత్రికు లెవరూ ఇబ్బంది పడినట్లుగా విసుగుకొన లేదు. ఎందువల్ల ననగా, వాళ్లు ఓడమీద ఉన్నంతకాలమూ, భగవత్ప్రార్థనలలోను, భగవద్ధ్యానంతోను కాలక్షేపం చేస్తూ వచ్చారు. నావమీద ఉన్న యాత్రికులకు అపత్కాలావసరమైన కట్టుదిట్టముకోసం కొంత కవాతు చేయించవలసి యున్నది. కాని, తరచుగా మక్కా యాత్రలు చేసి ఆరితేరిన పాత యాత్రికులు మాత్రము యీ కవాతులకు హాజరు కావడానికి సంకోచించేవారు. తిరుగు ప్రయాణంలో యీ విధంగా సంకోచించేవారు. వారిలో ఒక యాత్రికుడు అన్నాడు:—

"సుఖంగా తిరిగి యింటికి మమ్ములను చేర్చవలసిందనిన్నీ బ్రిటిషువారికి విజయము ప్రసాదించవలసినదనిన్నీ ఇదివరకే 'మేము భగవంతుని ప్రార్థించియున్నాము'" అని అన్నాడు. అందుచేత తనకు ఆపత్తురాదనిన్నీ, యీ కవాతు అనవసర మనిన్నీ అతని అభిప్రాయం.

# భారతదేశాన్ని రక్షించడం ఎట్లు?

## వావెలు సేనాని నిర్ణయములు.

ఇండియా, బర్మా యుద్ధతంత్రమునంతా నడిపించుటకు జనరలు సర్ ఆర్చిబాల్డు వావెలు సర్వసైన్యాధిపత్యం వహించాడు. ఈ అధిపత్యం వహించినతర్వాత మొదటిసారిగా మొన్న ఆర్చిబాల్డు వావెలుగారు పత్రికాప్రతినిధులయెదుట ప్రసంగిస్తూ, యీ క్రిందివిషయములు చెప్పారు:—

బర్మాలో పోరాటం శక్తివంచన లేకుండా సాగిస్తాము. రంగూను నగరం శత్రువశమైనప్పటికీ, బర్మాలోనికి క్రొత్త బ్రిటిష్ సేనలు పోవుచుండుటకును, బర్మాలో ప్రస్తుతం పోరాడుచున్న మన సేనలకు కావలసిన సామగ్రుల నన్నింటినీ సప్లయిచేయుటకును, మరొక మార్గం ఏర్పడియేయున్నది. జపాను సేనలు జావా ద్వీపమువద్దకు అతివేగంగా పరుగెత్తుకొని వచ్చినవి. మన సేనలు అచటికి చేరడానికి ఇంకొక్క నాలుగైదువారాలు వ్యవధి యుండినట్లయితే, అక్కడ యుద్ధ పర్యవసానం మరొకరీతిగా ఉండేది. మన సైనికబలం అంత

వేగంగా సమయానికి అచటికి చేరలేకపోయింది. మనం ఎప్పుడూ ఆలస్యంచేస్తూనే వచ్చాము. కాని, మలయాలో జరిగిన యుద్ధములోను, సింగపూరులో జరిగిన యుద్ధంలోను మనమెందుకు జయించలేదనే విషయం తర్కించడానికి యిది సమయం కాదు. ఇప్పుడా విషయాలన్నీ శవపంచాయితీ చేసినట్లుగా విమర్శచెయ్యవలసిన తరుణం ఇది కాదు. యుద్ధం ఆశ్వాసాంతం అయినతర్వాత అన్ని విషయాలూ అప్పుడు చర్చించి మనము తీర్పు చెప్పవచ్చు.

**దూరప్రాచ్యయుద్ధానికి సర్వసంసిద్ధంగా లేము.**

దూరప్రాచ్యంలో యుద్ధం సర్వసమర్థంగా చెయ్యడానికి మనము అక్కడ సర్వసంసిద్ధముగా లేము. అదే మూలకారణం. మధ్యప్రాచ్యంలో ఉన్న మన సేనలను అక్కడినుంచి, దూరప్రాచ్యమునకు అనగా సింగపూరు ప్రాంతానికి రప్పించియుండవచ్చును. కాని, మధ్యప్రాచ్యమువద్ద శత్రువు విజృంభించి బెదరిస్తూ ఉండడంచేత అచటినుండి ఆ సేనలను తొలగించడానికి అసందర్భం ఏర్పడింది. రష్యాకు పంపించుచుండిన ఆయుధసామగ్రులను రష్యాకు పంపించకుండా నిలిపి, దూరప్రాచ్యానికి పంపించుటకు కూడా అసందర్భ పరిస్థితిగానే ఏర్పడింది. ఇంగ్లాండులో నున్న సైనికబలమును ఇతర ఆయుధబలమును అచటినుండి తగ్గించి పంపించుటకు కూడా సందర్భ పరిస్థితులు అనుకూలించలేదు. అది కాకుండా, మన శత్రువు చాలా జాగ్రత్తగా ప్రతి చిన్నవిషయములోను కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేసికొని, చాలా మోసంగా ద్రోహంగా ప్రారంభంలోనే చాలా ముందుకు దూకి మన కంటె ఎక్కువ కట్టుదిట్టమైన స్థావరం ఏర్పరచుకొన్నాడు. అట్లయినప్పటికీ, డచ్చి యీస్టుయిండీసు దీవులవద్ద శత్రువునకు సముద్రముమీద చాలా తీవ్రమైన నష్టమును మనము కలుగజేసియున్నాము. కాని, మనకు ఎక్కువ నష్టమే కలిగింది.

**రంగూను కథకూడా అంతే.**

మలయాలోను సింగపూరులోను మనకు ఏ ప్రతిబంధకములు సంభవించినవో రంగూను విషయంలోను అటువంటి ప్రతిబంధకములే సంభవించినవి. రంగూనులో శత్రువులు ప్రవేశించడంవల్ల ఇప్పుడు ఇండియాకు చేరువలోనికి వచ్చారు. రంగూనకు కూడా రావలసిన సేనలు సకాలంలో చేరలేదు. ఉత్తరమున థాయిలాండు వైపునుండియు, దక్షిణమున టెన్నాసిరెం వైపునుండియు శత్రువులు రావడంవల్ల రహదారీ మార్గాలకు ప్రతిశ్రేణిలో మన సేనలు నిల్చుండి శత్రుసేనలను ఎదిరించడం చాలా దుష్కరమైన కార్యమైంది. రంగూను నుంచి తూర్పువైపుగా మన సేనలు విశేషంగా ముందుకు విస్తరించలేవు. అదికూడా ఒక చిక్కుగా ఏర్పడింది. మనవల్ల అనేక లోపాలు జరిగినవి. మనశత్రువు మనకంటె ముందుగా యీ అరణ్యప్రాంతాల యుద్ధంలో ఆరితేరి తయారుగా ఉన్నాడు. కాని మన సేనలు అరణ్యప్రాంత యుద్ధానికి సమగ్రశిక్షణ పొంది పూర్తిగా తయారుగా లేవు. అట్లయినప్పటికీ శత్రుసేనలతో మన సేనలు చాలా ధైర్యసాహసములు చూపి పోరాడినవనుటకు ఎటువంటి సందేహమూ లేదు.

ఇప్పటికే జపానువారి సైన్యబలము, పసిఫిక్కుమహాసముద్రంలోని హవాయి దీవులనుండి, ఆస్ట్రేలియా, మంచూరియా, బర్మా, చైనా, ఇండియా, సింహళం మొదలైన అన్నిప్రాంతాలమీదను దండయాత్రలు సాగించడానికి అనేకవేల మైళ్ళదూరంలో విస్తరించి ఉన్నాయి. వారు దేనిమీదకు పోయినను, దేనిమీదకు పోకున్నను, ఇండియామీదకు వస్తామని బెదరిస్తున్నారు కనుక యీ శత్రు ప్రమాదమునుండి యిండియాను రక్షించడం ఎట్లు? అనే విషయమై మనమిప్పుడు ఆలోచింపవలసియున్నది.

**భారత దేశ రక్షణ.**

సముద్రం మీదగాని, మెట్టమీదగాని ఆకాశంలోగాని యేవిధమైన సైనిక సన్నాహములను మేము చేయుచున్నామో ఆ వివరములనన్నింటినీ యిప్పుడు వెల్లడించడం నాపనికాదు. వెల్లడించవలసినదని మీరెవరూ కోరరనియే నా అభిప్రాయం. కాని ఒక్క విషయం చెప్పగలను. ఇండియాకు యీశాన్య ప్రాంతంలో గొప్ప బ్రిటిష్ విమానదళము ఏర్పాటు చేయబడుచున్నది. ఈ విమానదళము కేవలం భారత దేశరక్షణ విషయమై పని చేసేదికాదు. శత్రువుమీదకు కూడా దాడివెడలి రాగల విమానబలం ఇది. ఇండియాలో ఇదివరకే చాలా విమానాశ్రయాలు ఏర్పాటు చేయబడియున్నవి. ఇదిగాక ఇంకను మరికొన్ని కొత్త విమానాశ్రయములు తయారుచేయబడుచున్నవి. కొత్త విమానాలు ఇంకా ఇండియాకు వచ్చి చేరుచున్నవి.

కోస్తా ప్రాంతమును రక్షించుటకు నికరమైన నౌకా దళములు సిద్ధపరచబడుచున్నవి. దేశములోని పెద్ద పెద్ద నదులను దాటుటకు వీలైన ప్రదేశములలోను నదీముఖద్వారములలోను ఫిరంగులు మొదలైన ఆయుధములతో అమర్చబడిన నావలు ఏర్పాటుచేయబడుచున్నవి.

ఇక మెట్ట పటాలము విషయములో కొన్ని ప్రత్యేక స్థావరములను ఏర్పాటుచేయుటకు వీలులేదు కోస్తా వెంట ఏ ప్రాంతంనుంచి ఏ ప్రాంతానికి సేనలు పోవలసివచ్చినను, వెంటనే పంపబడుటకు వీలైన సైనిక దళములు ఏర్పాటు చేయబడుచున్నవి. కోస్తాలోని ఏ ప్రాంతంమీదకు శత్రువు రావలెనని ప్రయత్నిస్తున్నాడో ఆ ప్రాంతానికి మన సేనలు వెంటనే పంపబడగలవు వీలైనంత సమీప ప్రాంతాలలోనే అవి తయారుగా ఉండగలవు.

**పని వేగంగా జరుగుతోంది.**

దేశంలో జరగవలసిన బందోబస్తులు వగైరా పనులన్నీ గంటలలెక్కను జరుగవలెనని ఉత్తరువులు జారీచేయబడెను. విమానాశ్రయములుగాని, ఇతర కట్టడపు పనులుగాని 24 గంటలలోగా పూర్తి కావలెననే లెక్క ప్రమాణాలతో పనులు జరుగుచున్నవి.

శత్రువుల విమానదాడి జరిగినట్లయితే, ఆయా పట్టణములలో వెంటనే హెచ్చరికలు చేయబడుటకును, పౌరజన రక్షణార్థము జరగవలసిన పనులకును, విమానదాడి రక్షణ దళములు ఏర్పాట్లు పూర్తి చేయుచున్నవి.

**జపానుయొక్క చిక్కులు.**

జపానువారికి కూడా చాలా చిక్కులు ఉన్నాయి. అనేక వేలమైళ్ల దూరంలో ఉన్న జపాను దేశంనుంచి కదలివచ్చిన జపాను సేనలు ఇప్పుడు ఇండియాలో యుద్ధం చేస్తూ కూర్చుంటే, అక్కడ మంచూరియా మీదికే రష్యను సేనలు దూకగలవు అదిన్నీగాక యుద్ధానికి కావలసిన ప్రధాన వస్తు సామగ్రుల నిల్వ సరకు జపానుకు క్షీణించి పోవుచున్నది. జపానుకు యింతవరకూ నష్టమైన విమానములను తిరిగి భర్తీ చేసికొనగల్గుటకు తగినంతగా విమానములను ఉత్పత్తి చేయలేకుండా ఉన్నది. అదిన్నీగాక, ప్రపంచంలో అంతటికీ ప్రచండమైన జనసంఖ్యగల రాజ్యాలవారు జపానును ఎదిరించి నిలువబడియున్నారు. కాబట్టి మన మందరమూ గట్టి పట్టుదలతో ఎదిరించి నిలువగల్గితే జపానుకు అంత్యదశ తప్పదు.

# ఉపకారికి అపకారము.



ఇంగ్లండు సమీప సముద్రంలో కూలిపోయిన విమానాలలోని వైమానికులు, మిత్రులైనా సరే, శత్రువులైనా సరే, సముద్రంమీద ఉన్నట్లయితే వాళ్లను రక్షించి ఒడ్డుకు తెచ్చుటకై బ్రిటిష్‌వారి మోటారు పడవలు వెళ్లితే, వాటిమీద జర్మను విమానం బాంబులు వేస్తోంది ఆ జర్మను బాంబు విమానంతో బ్రిటిష్ విమానాలు పోరాడుతున్నవి.

---

## జర్మనులకు ఎదురోటులు—వీడోటులు

వచ్చింది-వసంతకాలం వచ్చింది. చైత్ర వైశాఖమాసాలు వసంతఋతువు. చైత్రమాసం మొన్న సంవత్సరాది పండుగతో ప్రవేశించింది. చిత్రభాను సంవత్సరం ప్రారంభమైంది. జర్మనీతో యుద్ధం ప్రారంభమై రెండున్నర సంవత్సరాలు దాటింది. చైనాతో జపాను యుద్ధం సాగించి అంతకు రెట్టింపుకాలం అయింది అనగా అయిదు సంవత్సరాలు కావచ్చింది. 1939 వ సం॥ సెప్టెంబరు మాసంలో జర్మనీతో యుద్ధం ప్రారంభమైంది. 1937వ సం॥ జూలై మాసంలో చైనాతో జపాను యుద్ధం ప్రారంభించింది. ఆ యుద్ధమూ సాగుతూనే ఉంది. ఈ యుద్ధమూ సాగుతూనే ఉంది. అది ఇదీ ఏకమై బ్రహ్మాండమైన ప్రపంచ సంగ్రామంగా జరుగుతోంది. వెనుక 25 ఏండ్ల క్రిందట జరిగిన మహా సంగ్రామం అయిరోపా ఖండంలోనే జరిగి అయిరోపా ఖండంలోనే ముగిసింది. 1914 వ సం॥నుంచి 1918 వ సం॥ వరకు నాలుగేళ్లు జరిగి ముగిసింది. అప్పుడు మన ఇండియా దేశానికి ఆ సంగ్రామదేవత రాలేదు.-ఏదో ఒక "ఎండెను" అనే జర్మను యుద్ధనావ ఒకనాటి రాత్రి వచ్చి నాలుగుగుండ్లు మద్రాసుమీద కాల్చి పారిపోయింది. అంతకుమించిన యుద్ధప్రమాదం మన దేశానికి అప్పుడేమీ కలుగలేదు.

అప్పట్లో, జపాను దేశము బ్రిటిష్‌వారికి మిత్ర రాజ్యంగానే ఉండి, తన వ్యాపారం తాను చూచుకొంటూ పిల్లి మూనవలె ఒకమూలకుఒదిగి మ్యావు మ్యావు మంటూ ఉంది. కాని 1918 వ సం॥లో వెనుకటి అయిరోపాయుద్ధం సమాప్తమైన పిమ్మటనుంచీ గత 20 ఏళ్లలోను జపాను వాళ్లకుకూడా వీరావేశం వచ్చింది. యుద్ధయాత్రలు చేసి ఇతర రాజ్యాలు ఆక్రమించి, దోచుకొని తినవలెననే ఆశ పెచ్చింది. అప్పటినుండీ ఆయుధసామగ్రిని విస్తారంగా తయారుచేసి, రష్యాలకు తయారైనట్లుగా తయారు కావడం ప్రారంభించారు. యుద్ధ యాత్రలు సాగించుటకోసం కావలసిన ద్రవ్యంకూడా విస్తారంగా నిల్వచెయ్యడం సాగించారు. ఇతర విదేశీ సరకులకు పోటీగా తాము చవుక సరకులను తయారుచేసి మన ఇండియాలోకి విరివిగా దిగుమతి చేశారు. ఇతర దేశాలకుకూడా విశేషంగా తమ చౌక వ్యాపారపు సరకులను రవాణాచేసి, బాగా వ్యాపారలాభాలు గడించి ద్రవ్యం నిల్వచేసారు.

గడించిన వ్యాపారద్రవ్యం యావత్తు, రాజ్యాలు గెల్వడానికి వినియోగించి, ఆయుధాలు తయారు చేసుకొని, ఆహుతి చేస్తున్నారు. అప్పుడు పిల్లి కూనవలె ఉండినటువంటి జపాను నేడు గండుపిల్లివలె గుడ్లెర్రచేసి కీంక్రించి గాండ్రించుచున్నది.

జపానువాళ్లు ఎంత, గాండ్రించినా, హిట్లరు తురాలో చేరడంవలనే, ఇరుకులోపెట్టి ఇండియానుకూడా నొక్కి-వేయగలమనే ధైర్యంతో మన దేశంమీదకుకూడా రావడానికి పొంచివుంచి ఉన్నారు. బర్మాలో ప్రవేశించి ఇంకా యుద్ధం చేస్తూనే ఉన్నారు. బర్మాలో రంగూనునుంచి తూర్పుగా ప్రోముమీదుగా పోయే రోడ్డు ఒకటి ఉన్నది ప్రోము రోడ్డుమీదుగా వెళ్లితే ఇండియాలోచేరిన అస్సాం రాష్ట్రముగుండా కలకత్తాకు చేరవచ్చును. ఈ ప్రోము రోడ్డుమీదుగా జపాను సేనలు కొంచెం కొంచెంగా ముందుకు సాగుతున్నవని నేటి వార్తలవల్ల తెలిసింది.

రంగూనునుంచి ఉత్తరంగా మాండలేనగరానికి మరొక రోడ్డు ఉన్నది. ఈ రోడ్డుమీదుగా కూడా జపాను సేనలు కొలదిమైళ్లదూరమే ముందుకు పోగల్గినవి. బర్మాలో ఇంకా మాండలేనగరంవద్ద యుద్ధం జరుగవలసియున్నది.

ఇదంతా అయిన తర్వాత ఇండియా దేశముయొక్క తూర్పు సరిహద్దులమీదకు అనగా అస్సాంరాష్ట్రంమీదకు జపానుసేనలు దండెత్తి రావచ్చునంటున్నారు.

ఇండియా తూర్పు సరిహద్దులమీదకు జపాను సేనలు రావలెననిన్నీ, ఇండియా పడమటి సరిహద్దులవద్దకు, అనగా ఆఫ్గని స్థానముమీదుగా పంజాబు రాష్ట్రంమీదకూ, పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రములవద్దకూ జర్మను సేనలు రావలెననిన్నీ ప్రయత్నించుచున్నవని అనుచున్నారు. తూర్పు వైపుగా జపాను సేనలూ, పడమటివైపుగా జర్మను సేనలూవచ్చి అడకత్తెరలోని పోక చక్కవలె ఇండియాను నొక్కి-వేయవలెనని, బ్రహ్మాండమైన కత్తెర వ్యూహమొకటి నిర్ణయించుకొని అక్షరాజ్యా వారు (అనగా, జర్మనీ, జపానులు) సన్నాహములు సాగించుచున్నవి.

జపాను మాత్రం యీ వరకే ఇండియాయొక్క తూర్పు సరిహద్దులవద్దకు చేరుకొనుచున్నది. జర్మనీ ఇండియా పడమటి సరిహద్దులవద్దకు ఇంకా చేరలేదు. ఇంకా ఆ ప్రయత్నంమీద బయలుదేరనేలేదు వసంతఋతువు ప్రారంభమైతేనేగాని జర్మనుసేనలు విజృంభించవు అని హిట్లరు మొన్న చెప్పిన ఉపన్యాసంలో కూడా అన్నాడు. మన తెనుగు పంచాంగం ప్రకారంగా వసంతఋతువు సంవత్సరాది పండుగతో ప్రారంభమయినది. కాని, అయిరోపా ఖండంలో వసంతఋతువు ఏప్రెలు నెలలో ప్రారంభమవుతుంది. మన వసంతఋతువుకు వారి వసంతఋతువుకు విశేషం తేడాలేదు. మనది చంద్రమానం. వారిది సూర్యమానం-పానీలేండి-ఎట్లాగైతేనేమి? మన వసంతఋతువు ప్రారంభమైన నెలరోజులకు వారి వసంతఋతువుకూడా ప్రారంభమవుతుంది ఈ లోపుగా మనకు శ్రీరామనవమి పండుగకూడా అయిపోతుంది. భద్రాద్రియాత్రకూడా భద్రంగా ముగించుకోవచ్చు.

జర్మను సేనలు ఏప్రెలు నెలలో ఆయుధాలు చేతబట్టుకొని బయలుదేరుతాయి అనుకోండి. అప్పుడు హిట్లరుగారు "రాజూ వెడలె రవితేజము లలరగ—డాలు కత్తులు మెరయగ" అని బయలుదేరుతాడు కాని, ఎటువైపు బయలుదేరుతాడు అనే విషయమే అందరికీ సందేహంగా ఉంది. రష్యాలో చలికాలంగా మంచుకాలంగా యింతవరకును తన జర్మను సేనలు రష్యాలో నిలువలేక వెనుకకు పారిపోయి వచ్చినవనిన్నీ, వసంతఋతువు రాగానే రష్యాలోకి జర్మను సేనలు విజృంభించి ఆ బోల్షెవిక్కు ప్రభుత్వాన్ని భస్మంచేసివేస్తాయనిన్నీ "పాడినదే పాడరా! పాచిపండ్ల దాసరీ!" అన్నట్లుగా తనంతట తానే లోకానికి చాటించుకొని, రష్యాలో తనకు కలిగిన అపజయానికి సమాధానం చెప్పుకొనుచున్నాడు. మొన్న హిట్లరు చెప్పిన యుపన్యాసంలో కూడా యిదేపాట పాడినాడు. కనుక హిట్లరు తన జర్మను సేనలను ఏప్రెలు నెలలో రష్యామీదకు నడిపిస్తాడా?

కాని, ఇండియా దేశాన్ని అటుయిటు కత్తెర వ్యూహంలో నొక్కవలెనని తూర్పున జపాను తయారుగా ఉన్నది. పడమటి వైపునుంచి జర్మను సేనలుకూడా ఎప్పుడు వచ్చునా? అని జపాను ఎదురు చూస్తోంది. కనక ఏప్రెలు మాసంలో హిట్లరు ఇండియా దేశపు పశ్చిమ సరిహద్దులవద్దకు వస్తాడా?

కనక ఇప్పుడు కలుగుచున్న ధర్మసందేహం ఏమిటంటే, ఏప్రెలు మాసంలో హిట్లరు తన సేనలను ఇండియావైపు నడిపిస్తాడా? రష్యామీదకు నడిపిస్తాడా?

రష్యామీదకు నడిపించే యెడల, ఇంగ్లండులోని బ్రిటిష్ విమానాలు ఆముహూర్తంలోనే జర్మనీ మీదకు దండెత్తడానికి సిద్ధంగా ఉన్నాయి అప్పుడు జర్మను సేనలు, ముఖ్యంగా జర్మను విమానదళములు, ఇంగ్లండువైపు తిరిగి పోరాడుటకు సిద్ధంగా ఉండాలి అటు పశ్చిమ రంగంలోనూ, ఇటు తూర్పు రంగంలోను, అనగా రష్యాలోను ఏకకాలమందు జర్మను విమానదళములు పోరాడవలసిన అగత్యం కలుగుతుంది అటువంటి క్లిష్టావస్థలో అటువంటి కత్తెర వ్యూహంలో జర్మను విమానబలము చిక్కుకొని నొక్కుకొని పోతూఉండాలి. తూర్పున రష్యను విమానాలతో పోట్లాడాలి పడమట ఇంగ్లండునుంచి జర్మనీ మీదకు దండెత్తివచ్చే బ్రిటిష్ విమానాలతోను పోట్లాడాలి. ఇటువంటి అవస్థలో జర్మనీ చిక్కుకొని పోయినట్లయితే, అటు రష్యా సేనలతోనూ సమర్థంగా పోట్లాడలేదు, ఇటు ఇంగ్లండునుంచి సాగింపబడే బ్రిటిష్ విమానదాడికి ఎదురు జవాబు చెప్ప లేదు. అటూచెడి, ఇటూచెడి ఉభయభ్రష్టత్వంపొంది, రెంటికిచెడిన రేవడులాగున జర్మనీయొక్క బలము సులభంగా క్షీణించగలదు. ఇటువంటి పద్ధతిని అవలంబించి జర్మనీని ఓడించడమే ఉత్తమమైన యుద్ధతంత్రమని కొత్తగా బ్రిటిష్ మంత్రివర్గంలో చేరిన సర్ స్టాఫర్డు క్రిప్సుగారు చెప్పియున్నారు. ఆ పద్ధతినే బ్రిటిష్‌వారు అవలంబించడానికి తమ విమానబలమును ఇంగ్లండులో పూర్తిగా సిద్ధపరచుచున్నారు. వసంతఋతువులో రష్యామీదకు జర్మను సేనలు విజృంభించినతోడనే, ఆముహూర్తంలోనే ఇంగ్లండునుంచి బాంబు విమానాలు జర్మనీ మీదకు దాడివెడలి అహోరాత్రాలు బాంబులు వేస్తూ ఉంటాయి. కనుక, అప్పుడు జర్మను విమానాలకు మంచి ఎదురోక్కులు సన్నాహము జరుగుతుంది.

ప్రస్తుతం మంచికో చెడ్డకో, "బ్రతుకు జీవుడా!" అని జర్మను సేనలు చావుతప్పి కన్ను లొట్టపోయినట్లుగా రష్యాలో చాలావరకు వెనుకకు వచ్చాయి. మాస్కో నగరమునకు రమారమి 250 మైళ్లు వెనుకకు వచ్చాయి. స్మోలెంస్కు వరకూ వచ్చాయి. రష్యా ప్రభుత్వాధ్యక్షుడైన స్టాలిన్ కూడా ఒక ఉపన్యాసంలో ఇటీవల స్పష్టంగా అన్నాడు. "జర్మను సేనలు, మా రష్యాలో చొరబడినవి గనుక, వాటిని మేము తరుమగొట్టుటకు ఆ జర్మను సేనలతో యుద్ధం చేస్తున్నాము. మా సరిహద్దులను దాటిపోయే వరకు ఈ జర్మను సేనల వెన్నంటు మా రష్యను సేనలు పోతూనే ఉంటాయి" అన్నాడు మన దేశంలోనైనా, మరొక దేశంలోనైనా పూర్వాచారమైన మర్యాదకూడా అదేవిధంగా ఉన్నది. పొలిమేర వరకూ సాగనంపించడమే మర్యాద. దానినే వీడ్కోలు అంటారు. వచ్చిన వానిని వీడ్కొల్పి రావడమే మా పని అని స్టాలిన్‌గారు చాలా సరసంగా చెప్పారు. ఆ వీడ్కోలు సన్మానం రష్యాలో జర్మను సేనలకు జరుగుతూ ఉంది.

కాని రష్యాలో తనకు యిటువంటి వీడ్కోలు సన్మానం జరిగినప్పుడు, హిట్లరు నిజంగా బుద్ధిగలవాడైతే, అంతటితో తృప్తిజెంది, తన బర్లిను నగరానికి తానుచేరి సుఖంగా ఉండవచ్చు. కాని, యీ వీడ్కోలు సన్మానం తనకు సరిగా జరగలేదన్నట్లుగా, మళ్లీ వసంత ఋతువులో రష్యాలోనికి మరొకసారి చొరబడతానంటున్నాడు. భూతప్రేత పిశాచములుకూడా, ఉచ్చాటన మంత్రం జపించి ఉద్వాసన చెప్పి ఊరి వెలుపలనున్న ఏ చింతచెట్టుమీదకో సాగనంపిన తర్వాత అక్కడనే బుద్ధికలిగి ఉంటాయిగాని, విడిచిపెట్టిన కొంపకు మళ్లీ రావు. కాని, నాజీభూతం, పొలిమేర దాటించి వచ్చినా, తిరిగి వెంటబడి వస్తానంటున్నది.

ఇటువంటి సందర్భంలో, వీడ్కోలు సన్మానంవల్ల తృప్తి పడనివానికి, ఎదుర్కోలు సన్మానం చెయ్యటమే ఉత్తమ పద్ధతియని బ్రిటిష్ మంత్రివర్గం నిర్ణయించింది. కనుక వసంతఋతువులో బ్రిటిష్ విమానాలే జర్మనీమీదకు బయలుదేరి ఎదుర్కోలు సన్మానాలు తమ బాంబు విమానాలతో చేయగలమని అనుమానాలులేకుండా వెల్లడించారు.

కనుక యీ పరిస్థితులలో జర్మనీకి వసంత ఋతువు వస్తే క్రొత్తగా చిగిరించే శౌర్యంగాని, పుష్పించి వికసించే క్రొత్త అవకాశంగాని, ఫలించే సంకల్ప ప్రయోజనంగాని ఏమీ ఉండదు. “వసంతఋతువు వస్తోంది! వసంతఋతువు వస్తోంది!” అని చంకలు కొట్టుకొని హిట్లరు ఎగురవలసిన సందర్భమేమీలేదు. “వస్తాడు మా బావ! వస్తాడు” అని గంతులు వేసినట్లుగా ఉంది. వసంతఋతువు వస్తున్నందుకు సంతోషించవలసింది మిత్రరాజ్యాల వారేగాని, శత్రు రాజ్యాలవారు కారు. ఎందుచేతనంటే, వసంత ఋతువులో హిట్లరును రెండు వైపులనుంచీ, అటు రష్యా ఇటు ఇంగ్లాండు ఒక్కసారిగా కొట్టడానికి పూనుకొని ఉన్నారు హిట్లరును మద్దెల వాయించినట్లుగా అటుయిటు వాయిస్తారు. అటు రష్యాలో వీడ్కోలు సన్మానం. ఇటు ఇంగ్లాండునుంచి ఎదుర్కోలు సన్మానం జరుగుతాయి. చిత్రభాను సంవత్సరంలో చైత్రమాసంలో యీ చిత్ర వసంత సమరం జరుగుటకు రంగస్థలం తయారుగా ఉంది. ప్రపంచంలో ఎక్కడనైనా, ఎవనికైనా ఒక పర్యాయంగా అటు వీడ్కోలు, ఇటు ఎదుర్కోలు జరుగుతుందా? అట్లా జరుగడం ఎన్నడూ ఎరుగము. కాని, యీ చిత్రభాను సంవత్సరంలో చిత్రంగా హిట్లరుకు అటువంటిది జరుగబోతున్నది. ఇదే బ్రిటిష్‌వారికిన్ని మిత్రమండలి రాజ్యాలకున్నూ విజయలక్ష్మిని చేబట్టుటకు తరుణం. ఏ విజయలక్ష్మిని హిట్లరు బ్రహ్మచారి వరించి పాణిగ్రహణము చేసుకోవలెనని వెంపర్లాడుతున్నాడో, ఆ విజయలక్ష్మి ఆఖరుకు ధర్మమూర్తులైన మిత్రమండలిని చేబట్టగలదు. శశిరేఖా పరిణయంలో ఏమైందో అదే అవుతుంది. దుర్యోధనాదులందరూ పెళ్లికి తర్లి వచ్చారు. ఆఖరుకు తేళ్లు జెర్రెలుకుట్టి నానా అవస్థల పాలైనారు. ఎక్కడచూచినా పెను భూతములు వెంటబడినాయి. పెళ్లికి తర్లివచ్చినవారు వెళ్లిపోయినారు ఆఖరుకు శశిరేఖ తన మేనత్త కొడుకునే వివాహమాడింది. పాండవుల కోడలైంది. కనుక యిటువంటి దురవస్థలోకి జర్మనీ రావలసియున్నది. ఈ పరిస్థితులలో ఇండియామీదకుకూడా జర్మను సేనలు దండెత్తిరావడం అసంభవం. అటు పడమటివైపుగా జర్మను సేనలు ఇండియా సరిహద్దులకు చేరితేనేగాని, ఇటు తూర్పు వైపునుంచి జపాను సేనలు తమ దండయాత్రను ఇండియామీదకు సమర్థంగా సాగించలేవు. ఇది నిశ్చయం. కనుక జపానున్నూ, జర్మనీయున్నూ ఇండియా విషయంలో సంకల్పించిన కత్తెరవ్యూహం ఉత్తవ్యామోహమేగాని, నెరవేరేదికాదు. వసంతఋతువు కోసం ఎదురుచూచేటటువంటి వీరి ఊహలన్నీ వట్టి విరహతాపాలేగాని సార్థకమైన సమర ప్రతాపాలు కావు

ఎవడికైనా సరే, అటు వీడ్కోలు, ఇటు ఎదుర్కోలు జరిగినదంటే, తప్పకుండా కాళ్ల బేరానికి వచ్చి, ఆ కష్టనష్టాలు భరించలేక భ్రష్టుడై, సాష్టాంగప్రణామాలు తప్పకుండా చేస్తాడు. సంధి పత్రాలమీద ప్రమాణాలు చేసి సంతకాలు చేస్తాడు. “శరణు! శరణు!” అనే వేడ్కోలు వరకు వస్తుంది వ్యవహారం కనుక, జర్మనీకి జరుగబోయే ఎదుర్కోలు, వీడ్కోలు మహిమవల్ల వేడుకోలు వరకు జర్మనీ వస్తుంది. అందుకే వస్తోంది వసంతం. సర్వలోక సంతాపమంతరింపజేసి సంతసమును సమకూర్చే వసంతమిది.

## ఇండియా-చైనా మైత్రి: శత్రువులకు తంత్రం.

చైనాకు ప్రస్తుతం ప్రభుత్వ కార్యస్థానంగా ఉన్న చంకింగు నగరపు రేడియోలో ఇటీవల యస్. హెచ్. స్మిత్తుగారు ఉపన్యసించి యీ క్రింది విషయాలు చెప్పారు.—

భారతదేశానికీ, చైనాకూ పరస్పర సద్భావమూ, పరస్పరాభిమానమూ ఏర్పడినవి. ఈ రెండు దేశముల మొత్తం జనసంఖ్య లెక్కచూస్తే ప్రపంచ మానవకోటిలో మూడవ వంతుగానున్నది. ఇటువంటి యీ రెండు దేశములకుగల సంబంధ బాంధవ్యం నేడు మరింత వృద్ధిపొందినది. చైనా ప్రభుత్వాధ్యక్షుడైన చంగు కై షేకుగారు ఇండియాకు వెళ్లి వచ్చుటవల్ల ఆ సంబంధ బాంధవ్యం వృద్ధిపొందినది. చంగు కై షేకుగారు ఇండియాకు విచ్చేసిరనే వార్త ప్రపంచమునంతనూ కంపింపజేసింది. చంగు కై షేకుగారు కేవలం చైనా ప్రభుత్వాధ్యక్షుని హోదాలో మాత్రమే ఇండియాకు పోలేదు. ఈ మహా సంగ్రామములోని ఒక భాగమైన చైనా రంగమందు, అనగా, చైనా, తాయిలాండు, ఇండో-చైనా రాజ్యాలు చేరినటువంటి యుద్ధరంగమునందు మిత్రమండలి సేనలకు తాను సర్వసేనాధిపతిననే హోదాలో వారు ఇండియాకు వెళ్లియుండిరి. భారతదేశంలో వారికి చేయబడిన సన్మానమునూ, వారికొసంగబడిన గొప్ప స్వాగత గౌరవమునూ చూస్తే, భారతదేశములోని వివిధ శాఖలవారికీ వివిధ పక్షములవారికీ, చంగు కై షేకుగారు ఎంత ప్రేమపాత్రులో వెల్లడియగుచున్నది.

జపానువాళ్లు ఆసియా ఖండంలో తమ ఆధిపత్యం క్రింద “విశాల ఆసియాఖండ రాజ్యమును” ఏర్పాటు చేయదలచియున్నామనిన్నీ, ఆసియా ఖండపు తూర్పుభాగంలో ఉన్న జాతులవారినందరినీ ఏకం చేయదలచి యున్నామనిన్నీ లోకానికి చాటుచున్నారు. “ఈ విస్తృతాసియా ఖండ ప్రాచ్య రాజ్యము” స్థాపించవలెననే జపాను సంకల్పం ఎటువంటిదో, దాని అంతరార్థమేమిటో, జపానులోని యుద్ధవీరులకుగల మితిమీరిన రాజ్యదాహము ఎటువంటిదో, భారతదేశ నాయకులకు చంగు కై షేకు గారు బోధపరచియున్నారు.

చైనాలో జపానువాళ్లు జయించినంతమేరకు కొంత భాగాన్ని ఆక్రమించియున్నారు. ఈ ఆక్రమిత రాజ్యంలోని చైనా ప్రజలు ఆ జపానువారి ఏలుబడిక్రింద ఎటువంటి దుర్భర స్థితిని అనుభవిస్తున్నారో గ్రహించితే, జపానువారి ఏలుబడి ఎటువంటిదో బోధపడుతుంది. జపానువారు స్థాపించబోయే నూతన సామ్రాజ్యం, అనగా “విస్తృతాసియా ఖండ ప్రాచ్య రాజ్యం’ భూతలస్వర్గం ఎన్నటికీ కాదు—అందుకు విరుద్ధమైనదేగాని మరొకటి కాదు. ఆక్రమిత చైనా రాజ్య

భాగంలోని ప్రజలు ఇదివరకు సుఖంగా, సుభిక్షంగా జీవిస్తూ ఉండేవారు. ఇప్పుడు వారు తిండిలేక మాడుతున్నారు. దుర్భర దారిద్ర్యం అనుభవిస్తున్నారు—మీదు మిక్కిలి స్వాతంత్ర్యంలేని బానిసలై, జపానువారికి లొంగిలోబడి, క్రుంగి కృశిస్తున్నారు. ఇటువంటి ఘోరదురవస్థను వర్ణించడంకూడా ఎందుకు? చైనా దేశీయులకు ఇది పూర్తిగా తెలిసిన విషయమే. అందులో ముఖ్యంగా చంగుకై షేకుగారికి యీ పరిస్థితి పరిపూర్ణంగా తెలియును. కనుక, జపానువారి సామ్రాజ్య సంకల్పములగురించి భారతీయులకు ఏవైనా అపోహలూ, దుర్భ్రమలూ ఉన్నట్లయితే, చంగు కై షేకుగారు వెళ్లి భారతీయులకు ఆ దురభిప్రాయాలను తొలగించి యుండగలరు.

భారత దేశంమీద జపాను కన్ను వేసి కబళించడానికీ తయారవుతున్నది. ఈ లోపుగా భారత దేశంలోని ప్రజలను చీలదీసి కొంత మిత్రభేదతంత్రం సాగించవలెనని జపాను ప్రయత్నిస్తోంది. సులభంగా భారతదేశాన్ని మ్రింగివేయుటకు జపాను యీ పని చేయుచున్నది. జర్మనుల మాదిరిగానే, జపానువారుకూడా బూటకపు మాటలు, దొంగవాగ్దానములు ఆశలు కల్పించి తమ రేడియోద్వారా భారతీయులకు చెప్పుతున్నారు. భారతదేశము యొక్క మేలు కోరినవాళ్లనందరినీ తిట్టి వారిమీద లేని పోని అపవాదులు, అపనిందలు కల్పించి చెప్పడం సాగించారు. జపాను రేడియోలో ఎటువంటి అబద్ధాలు కల్పించి చెప్పుతున్నారో చూడండి. భారతీయ పటాలములు తమ అధికారులను ధిక్కరించి ప్రవర్తిస్తున్నవని ఒక అభూత కల్పనాకథ సృష్టిచేసి, నిష్కళంక ప్రతాపమూర్తులైన భారతీయ వీరులను నిందలపాలుచేసి, లోకంలో వారికిగల గౌరవము చెడగొట్టుతూ, యిటువంటి ప్రచారం జపానువారు చేస్తున్నారు. వీరు చేసే ప్రచారంలో కించిత్తయినా సత్యం అనేది లేదు.

చైనావారినిగూర్చి జపాను సేనలు ప్రచారంచేసిన అభూత కల్పనలూ, అపవాదులూ ఎటువంటివో యివికూడా అటువంటివే. కాని యిటువంటి అసత్యప్రచారంవల్లనే జనులలో అనేక వదంతులు వ్యాపించగలవు. సత్యమును గ్రహించుటకు బదులుగా ప్రజలు యీ అసత్యములనే నమ్ముతూ ఉంటారు. కనుక దుష్ప్రచారానికికూడా కొంత ప్రమాదకరమైన ప్రభావం వున్నది. ఒక్కొక్క అబద్ధపు వదంతి ప్రజలలో వ్యాపిస్తే శత్రువుకు అది చాలా లాభకరం. తుపాకీగుండ్ల ఖర్చు లేకుండానే కొంతవరకు జయించగలుగుతాడు. ఒక్కొక్క వదంతి ఒక్కొక్క తుపాకీ గుండులాగున పనిచేయగలదు. తుపాకీ గుండ్లు దేహంలోనే గుచ్చుకుంటాయి. ఈ అసత్య ప్రచారపు వదంతులు ప్రజల హృదయములలో గుచ్చుకొని, వారి ఆత్మధైర్య కవచమును భేదించగలవు జపానువారి తంత్రాలన్నీ చంగు-కై-షేకు గారికి బాగా తెలియును భారత దేశ పరిస్థితులను బాగా తెలిసికొని, వివిధంగా భారతీయులకు మనస్సు విరిగిపోయేటట్లు ప్రచారం చేయవలెనో బాగా నేర్పి, కొందరు పెద్దవాళ్లను, మంచిమేధావంతులను శత్రురాజ్యాలలో తయారుచేసి ఉంచారు. ఈ పెద్ద తలకాయలనే ప్రచార ఫిరంగులుగా తయారుచేసారు. భారతదేశపు ప్రస్తుత రాజ్యాంగ వ్యవహార సమస్యల విషయంలో భారతీయులలో భారతీయులకే కొన్ని భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. భిన్న పక్షాలవారికి మనస్సు కలియకుండా ఉన్నది. ఈ సందర్భమును పురస్కరించుకొని జపాను రేడియోలోను, జర్మన్ రేడియోలోను మరింతగా యీ విషయమై ప్రచారంచేసి భారతీయుల మనస్సులను మరింత విరిచివేసి, భారతదేశాన్ని సులభంగా హరించవలెనని ప్రయత్నిస్తున్నారు.

బ్రిటిషు యుద్ధ మంత్రివర్గములోనూ, పసిఫిక్కు యుద్ధ కార్యాలోచన మండలిలోనూ భారత దేశ ప్రతినిధిగా నుండుటకు తగిన భారతీయుని నిర్ణయించవలసినదిగా బ్రిటిషువారు ఇండియాలోని వైస్రాయిని కోరియుండిరి. ఆ యుద్ధ మంత్రివర్గంలోఉన్న ఇతర బ్రిటిష్ అధినివేశ రాజ్యాల ప్రతినిధులతో సరిసమానమైన హోదా భారతదేశ ప్రతినిధికి కూడా ఏర్పడగలదు.

దురాక్రమణ చేస్తూ దండయాత్రలు సాగించుచున్న శత్రువుల నెదిరించడంలో, చైనాయున్నూ, భారత దేశమున్నూ నేడు ఏకీభవించి ఉన్నాయి. శత్రువుకు లొంగినట్లయితే, అపార నష్టమును పొందగలిగిన రాజ్యాలివి రెండూ అయి యున్నవి. చైనాకు కావలసిన సామగ్రులను ఇండియా సప్లయి చేయవలసి యున్నది. ఈ సామగ్రుల సప్లయితో జపాను సేనలను ఎదిరించి చంగుకై షేకుగారు యుద్ధం చేస్తూ ఉండగలరు ఈ చైనా, ఇండియా రాజ్యాల జన సంఖ్య అపారమైనది. కనుక, చైనా సహాయం ఇండియాకు కావాలి, ఇండియా సహాయం చైనాకు కావాలి.

చంగు కై షేకుగారు ఇండియాకు విచ్చేసి ఇండియాలోని ప్రజానాయకులతో కలిసి మాట్లాడుటవల్ల, యుద్ధంలో భారతీయు లెక్కువ శ్రద్ధాసక్తులతో పాల్గొనుటకు భారతీయ నాయకులను వారు ప్రోత్సహించి యుంటారని తలంచవచ్చును. లండనులోనున్న చైనా రాయబారియగు డాక్టరు వెల్లింగ్టను కూ గారు ఇటీవల చెప్పినట్లుగా, అటునుంచి జర్మను సేనలూ, ఇటునుంచి జపాను సేనలూ ఒక పెద్ద కత్తెర వ్యూహంగావచ్చి ఇండియాలో సంధించవచ్చు. ఈ విషయమును గూర్చి చంగు కై షేకుగారు భారతీయనాయకులతో మాట్లాడినప్పుడు నొక్కి వక్కాణించి యుండగలరు. చంగు కై షేకుగారికి భారత దేశంలో చాలామందితో మంచి పరిచయం కలదు. భారత దేశంలోని మహమ్మదీయ నాయకులలో వారికి పలుకుబడి ఉన్నది. చైనాలో ఒకటిన్నర కోటి మంది మహమ్మదీయులున్నారు. చైనాలోని క్వాంగ్సే పరగణాలోని చైనా సేనలకు సేనాధిపతియైన పాయిచంగుసీ గారు మహమ్మదీయుడు. చైనా ప్రభుత్వపు సైనిక శాఖకు అతడు ఉపాధిపతిగా వ్యవహరిస్తున్నాడు. చంగు కై షేకుగారు ఇండియాకు వెళ్లక పూర్వమే, భారత దేశ నాయకులు కొందరు వారికి పరిచితులై యుండిరి. రెండు సంవత్సరముల క్రిందట పండిత జవహరిలాలు నెహ్రూగారు చైనాకు వెళ్లి చంకింగునగరములో ఉండి, చంగు కై షేకుగారితో మాట్లాడి వచ్చిరి. చైనావారు ఎంత పట్టుదలతో పోరాడుచున్నారో స్వయంగా ఆయన చూచివచ్చారు.

ఒక చైనా పత్రిక నేడు యీ విధంగా వ్రాసింది :— జపానున్నూ, జర్మనీయున్నూ చిరకాలంనుంచీ ఇండియా మీద కన్ను వేసియున్నవి. భారత దేశంలోనే తీవ్రమైన అంతః కల్లోలములను పుట్టించవలెననే ఆలోచనలు శత్రు రాజ్యాలు చేసినవి కాని, చివరకు ఇండియాలో కలిగిన పర్యవసాన ఫలిత మేమిటంటే, భారతీయులందరూ ఫాసిస్టు ప్రాబల్యమును ప్రతిఘటించి పోరాడవలెననే సంకల్పంతో ఏకీభవించి యున్నారు.

1937వ సం॥ జూలై మాసంలో చైనాతో జపాను యుద్ధం సాగించిననాటినుండియు చంగు కై షేకు గారు చైనా ప్రజల ధైర్యోత్సాహములకు గురుపీఠంగా ఉన్నారు. భారతీయులకు కూడా చంగు కై షేకుగారివల్ల అటువంటి ఉత్సాహ ప్రబోధము కలుగు ననుట కెట్టి సందేహమున్నూ లేదు.

MADRAS: PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.